# అథ చతుర్దశో%ధ్యాయః

## వజ్రాంగుడు

నారద ఉవాచ|

విష్ణుశిష్య మహాశైవ సమ్యగుక్తం త్వయా విధే | చరితం పరమం హ్యేతచ్ఛివాయాశ్చ శివస్యచ || 1

కస్తారకాసురో బ్రహ్మన్ యేన దేవాః ప్రపీడితాః | కస్య పుత్రస్స వై బ్రూహి తత్కథాం చ శివాశ్రయామ్ || 2

భస్మీ చకార స కథం శంకరశ్చ స్మరం వశీ | తదపి బ్రూహి సుప్రీత్యా%ద్భుతం తచ్చరితం విభోః || 3

కథం శివా తపో%త్యుగ్రం చకార సుఖహేతవే | కథం ప్రాప పతిం శంభుమాదిశక్తి ర్జగత్పరా|| 4

ఏతత్సర్వమశేషేణ విశేషేణ మహాబుధ | బ్రూహి మే శ్రద్ధధనాయ స్వపుత్రాయ శివాత్మనే || 5

నారుదుడిట్లు పలికెను-

హే విష్ణు శిష్యా! నీవు శివ భక్తులలో శ్రేష్ఠుడవు హే విధీ! నీవు ఈ శివాశివుల పరమచరితమును చక్కగా వివరించితివి. (1) హే. బ్రహ్మన్! దేవతలను తీవ్రముగా పీడించిన తారకాసురుడెవ్వరు? అతడెవని కుమారుడు? శివునిచుట్టూ తిరిగే ఆ గాథము చెప్పుము (2) ఆ జితేంద్రియుడగు శంకరుడు మన్మథుని భస్మము చేసిన విధమెట్టిది పరమేశ్వరుని ఆ అద్భుతగాథను గూడ మిక్కిలి ప్రీతితో చెప్పుము. (3) జగత్స్వరూపిణి, ఆదిశక్తి యగు శివాదేవి శంభుని భర్తగా పొంది ఆ నందించుట కొరకై మిక్కిలి తీవ్రముగు తపస్సును

చేసిన విధం బెయ్యది? (4) హే మహాప్రాజ్ఞా! శివభక్తుడను, నీ పుత్రుడను, శ్రద్ధ గలవాడను అగు నాకు ఈ గాథనంతనూ వివరించి చెప్పుము(5).

బ్రహ్మోవాచ|

పుత్రవర్య మహాప్రాజ్ఞ సురర్షే సంసిత వ్రత| వచ్మ్యహం శంకరం స్మృత్వా సర్వం తచ్చరితం శృణు|| 6

ప్రథమం తారకసై#్యవ భవం సంశృణు నారద| యద్వధార్థం మహాయత్నః కృతో దేవైశ్శివాశ్రయః || 7

మమ పుత్రో మరీచిర్యః కశ్యపస్తస్య చాత్మజః | త్రయోదశ మితాస్తస్య స్త్రియో దక్ష సుతాశ్చయాః || 8

దితిర్జ్యేష్ఠా చ తత్ స్త్రీ హి సుషువే సా సుతద్వయమ్ | హిరణ్య కశిపుర్జ్యేష్ఠో హిరణ్యాక్షో%నుజస్తతః || 9

బ్రహ్మ ఇట్లు పలికెను-

ఓ దేవర్షీ! నీవు నా కుమారులలో శ్రేష్ఠుడవు. మహాజ్ఞానివి. నీ భక్తి ముల్లోకములలో ప్రసిద్ధి గాంచినది. నేను శంకరుని స్మరించి ఆయన చరితమునంతనూ చెప్పెదను వినుము. (6) ఓ నారదా!ముందుగా తారకుని జన్మ వృత్తాంతమును వినుము. తారకుని వధ కొరకై దేవతలు శివుని ఆశ్రయించి గొప్ప యత్నమును చేసిరి. (7) నా మానస పుత్రుడు మరీచి. అతని కుమారుడు కశ్యపుడు. అతడు దక్షుని పదముగ్గురు కుమార్తెలను వివాహమాడెను. (8) వారిలో దితి పెద్ద భార్య. ఆమెకు ఇద్దరు కుమారులు గలరు. వారిలో హిరణ్య కశిపుడు జ్యేష్ఠుడు. వాని తమ్ముడు హిరణ్యాక్షుడు(9).

తౌ హతౌ విష్ణునా దైత్యౌ నృసింహ క్రోడరూపతః| సుదుఃఖదౌ తతో దేవాస్సుఖమాపుస్చ నిర్భయాః||10

దితిశ్చ దుఃఖితాసీత్సా కశ్యపం శరణం గతా| పునస్సంసేవ్య తం భక్త్యా గర్భమాధత్తసువ్రతా|| 11

తద్విజ్ఞాయ మహేంద్రోఽపి లబ్ధచ్ఛిద్రోమహోద్యమీ| తద్గర్భం వ్యచ్ఛినత్తత్ర ప్రవిస్య పవినా ముహుః || 12

తద్ర్వతస్య ప్రభావేణ న తద్గర్భో మమార హ | స్వపంత్యా దైవయోగేన సప్త సప్తాభవన్ సుతాః || 13

దేవతలకు మిక్కిలి దుఃఖమును కలిగించిన ఆ రాక్షసులనిద్దరినీ విష్ణువు క్రమముగా నృసింహవరాహ రూపములతో సంహరించెను. అపుడు దేవతలు భయమును వీడి సుఖించిరి. (10) . దితి దుఃఖితురాలై కశ్యపుని శరణు పొందెను. ఆమె ఆయనను మరల భక్తితో చక్కగా సేవించెను. గొప్ప దీక్ష గల ఆమె గర్భమును ధరించెను. (11). ఆ విషయమునెరింగి గొప్ప యత్నశీలుడగు మహేంద్రుడు దోషమును కనిపెట్టి, ఆమె యందు ప్రవేశించి వజ్రముతో పలుమార్లు ఆమె గర్భమును భేదించెను. (12). ఆమె వ్రతమహిమచే నిద్రించుచున్న ఆమె గర్భము మరణించలేదు. దైవానుగ్రహముచే ఆమెకు నలుభై తొమ్మిది మంది కుమారులు పుట్టిరి.(13).

దేవా ఆసన్ సుతాస్తే చ నామతో మరుతోఽఖిలాః | స్వర్గం యయుస్తదేంద్రేణ దేవరాజాత్మసాత్కృతాః || 14

పునర్దితిః పతిం భేజేఽనుతప్తానిజకర్మతః| చకార సుప్రసన్నం తం మునిం పరమసేవయా|| 15

మరుత్తులను పేరుగల ఆ కుమారులందరు దేవతలై స్వర్గమును పొందిరి. ఆపుడు దేవరాజగు ఇంద్రుడు వారిని తన వారినిగా చేసుకొనెను. (14). దితి తాను చేసిన దోషమునకు పరితపించి మరల భర్త వద్దకు వెళ్లి గొప్ప సేవను చేసి, ఆ మహర్షిని మిక్కిలి ప్రసన్నునిగా చేసెను.(15).

కశ్యప ఉవాచ|

తపః కురు శుచిర్భూత్వా బ్రహ్మణశ్చాయుతం సమాః | చేద్భవిష్యతి తత్పూర్ణం భవితా తే సుతస్తదా || 16

తథా దిత్యా కృతం పూర్ణం తత్తపశ్శ్రద్ధయా మునే | తతః పత్యుః ప్రాప్య గర్భం సుషువే తా దృశం సుతమ్ || 17

వజ్రాంగ నామా సో%భూ ద్వై దితిపుత్రో%మరోపమః|నామతుల్యతను ర్వీర స్సుప్రతాప్యుద్భవాద్బలీ|| 18

జననీ శాసనాత్సద్యస్స సుతో నిర్జరాధిపమ్| బలాద్ధృత్వా దదౌ దండం వివిధం నిర్జరానపి|| 19

కశ్యపుడిట్లు పలికెను-

నీవు శుచివై పదివేల సంవత్సరములు బ్రహ్మను గురించి తపస్సును చేయుము. నీ వ్రతము పూర్ణము కాగలగినచో, నీకు అపుడు కుమారుడు జన్మించగలడు (16). ఓ మహర్షీ! దితి అటులనే పూర్ణమగు తపస్సును శ్రద్ధతో చేసెను. తరువాత ఆమె భర్తనుండి గర్భమును పొంది గొప్ప కుమారుని గనెను(17). దేవతలతో సమానుడగు ఆ దితి పుత్రుడు వజ్రాంగుడను పేరు గల వాడాయెను. అతడు పేరుకు తగ్గ దేహము గలవాడు, వీరుడు, గొప్ప పరాక్రమశాలి, మరియు పుట్టిన నాటినుండియూ బలశాలి (18). ఆ దితి పుత్రుడు తల్లి ఆజ్ఞచే వెను వెంటనే ఇంద్రుని, కొందరు దేవతలను కూడ బలాత్కారముగా తీసుకొని వచ్చి అనేక విధములుగా దండించెను(19).

దితిస్సుఖమతీవాపర దృష్ట్వా శక్రాదిదుర్దశామ్ | అమరా అపి శక్రాద్యా జగ్మర్దుఃఖం స్వకర్మతః || 20

తదాహం కశ్యపేనాశు తత్రాగత్య సుసామగీః | దేవానత్యాజయంస్తస్మా త్సదా దేవహితే రతః || 21

దేవాన్ముక్త్వా స వజ్రాంగస్తతః ప్రోవాచ సాదరమ్ | శివభక్తో%తి శుద్ధాత్మా నిర్వికారః ప్రసన్నధీః || 22

ఇంద్రుడు మొదలుగా గల ఆ దేవతల దుస్థ్సితిని గాంచి దితి ఆనందించెను. ఇంద్రుడు, ఇతర దేవతలు తమ కర్మలకు అను రూపమైన దుఃఖమును పొందిరి (20). నిత్యము దేవతల హితమును చేయ గోరు నేను అపుడు శీఘ్రమే చక్కని సామగానమును చేయుచూ అచటకు వచ్చి వజ్రాంగుని చెరనుండి దేవతలను విడిపించితిని(21). శివభక్తుడు, మిక్కిలి పవిత్రమగు అంతఃకరణ గలవాడు, రాగద్వేషములు లేకుండా ప్రసన్నముగా నుండు బుద్ధి గలవాడునగు ఆ వజ్రాంగుడు అపుడా దేవతలను విడిచి పెట్టి ఆదరముతో నిట్లు పలికెను(22)

వజ్రాంగ ఉవాచ|

ఇంద్రో దుష్టః ప్రజాఘాతీ మాతుర్మే స్వార్థసాధకః | స ఫలం ప్రాప్తవానద్య స్వరాజ్యం హి కరోతు సః || 23

మాతురాజ్ఞావశాద్బ్రహ్మన్ కృతమేతన్మయాఖిలమ్ | నమే భోగాభిలాషో వై కస్యచిద్భువనస్య హి || 24

తత్త్వసారం విధే బ్రూహి మహ్యం వేదవిదాం వర| యేనం స్యాం సుసుఖీ నిత్యం నిర్వికారః ప్రసన్నధీః || 25

వజ్రాంగుడిట్లు పలికెను-

ఇంద్రుడు స్వార్థపరుడగు దుష్టుడు. నా తల్లిగారి సంతానమును హింసించినాడు. దానికీ నాడు ఫలమునను భవించినాడు. అతని రాజ్యమును అతడు ఏలు కొనవచ్చును(23). హే బ్రహ్మ!దీనినంతనూ నేను తల్లిగారి ఆజ్ఞచే చేసితిని. నాకు ఏ భువనములనైనా పాలించి భోగించవలెననే ఆశ లేనే లేదు(24). హే విధీ! నీవు వేదవేత్తలలో

అగ్రగణ్యుడవు. ఏ ఆత్మతత్త్వ సారము నెరింగి నేను నిత్యానందమును, వికారము లేని ప్రసన్నమగు అంతః కరణమును పొందగలనో, అట్టి తత్త్వసారమును నాకు భోధించుము (25).

తచ్ఛ్రుత్వాహం మునే%వో చం సాత్త్వికో భావ ఉచ్యతే | తత్త్వసార ఇతి ప్రీత్యా సృజామ్యేకాం వరాం స్త్రియమ్|| 26

వరాంగీం నామ తాం దత్త్వా తస్మై#్మ దితి సుతాయవై| అయాం స్వధామ సుప్రీతః క శ్యస్తత్పితాపి చ || 27

తతో దైత్యస్స వజ్రాంగస్సాత్త్వికం భవమాశ్రితః | అసురం భవముత్సృజ్య నిర్వైర సుఖమాప్తవాన్ || 28

న బభూవ వరాంగ్యా హి హృది భావో%థ సాత్త్వికః | సకామా స్వపతిం భేజే శ్రద్ధయా వివిధం సతీ || 29

ఓ మహర్షీ! నేనా మాటను విని ఇట్లు పలికితిని . జ్ఞానవైరాగ్యాది సాత్త్విక భవనలే తత్త్వసారమని చెప్పబడును. నేను ప్రీతితో ఒక శ్రేష్ఠకన్యను సృష్టించితిని(26). వరాంగియను ఆ కన్యను ఆ దితిపుత్రునకిచ్చి వివాహము చేసి నేను నా ధామమును చేరితిని. నేను మాత్రమే గాక అతని తండ్రియగు కశ్యపుడు కూడ మిక్కిలి సంతసించెను.(27). అపుడా దితిపుత్రుడగు వజ్రాంగుడు రాక్షస భావనలను విడనాడి, సాత్త్విక భావము నాశ్రయించి, విరోధము లేని వాడై సుఖించెను. (28). కాని వరాంగికి హృదయములో సాత్త్విక భావమునెలకొనలేదు. ఆమె కామనతో కూడినదై తన భర్తను శ్రద్ధతో వివిధ పద్ధతులలో సేవించెను.(29).

అథ తత్సేవనాదాశు సంతుష్టో%భూన్మహాప్రభుః| స వ్రజాంగః పతిస్తస్యా ఉవాచ వచనం తదా|| 30

ఆమె భర్తయగు ఆ వజ్రాంగ మహాప్రభుడు అపుడామె సేవచే సంతసించి వెంటనే ఇట్లు పలికెను(30).

వజ్రాంగ ఉవాచ|

కిమిచ్ఛసి ప్రియే బ్రూహి కింతే మనసి వర్తతే | తచ్ఛ్రుత్వా నమ్య తం ప్రాహ సా పతిం స్వమనోరథమ్ || 31

వజ్రాంగుడిట్లు పలికెను-

ఓ ప్రియురాలా! నీ కోరిక యేమి? నీమనస్సులో నేమున్నది?చెప్పుము. ఆమె ఆ మాటను విని భర్తకు నమస్కరించి తన కోరిక అతనితో నిట్లు చెప్పెను(31).

వరాంగ్యువాచ|

చేత్ ప్రసన్నో%భవస్త్వం వై సుతం మే దేహి సత్పతే| మహాబలం త్రిలోకస్య జేతారం హరిదుఃఖదమ్ || 32

వరాంగి ఇట్లు పలికెను-

ఓ మంచి మొగుడా! నీవు నా పై ప్రసన్నుడవైనచో , మహాబలశాలి, ముల్లోకములను.

జయించువాడు, ఇంద్రునకు దుఃఖము నీయగలవాడు అగు కుమారుని నాకు ఇమ్ము(32)

బ్రహ్మోవాచ|

ఇతి శ్రుత్వా ప్రియావాక్యం విస్మితో%భూత్సఆకులః| ఉవాచ హృది జ్ఞానీ సాత్త్వికో వైరవర్జితః || 33

ప్రియేచ్ఛతి విరోధం వై సురైర్మే న హి రోచతే | కిం కుర్యాం హి క్వ గచ్ఛేయం కథం నశ్యేన్న మే పణః || 34

ప్రియా మనోరథశ్చైవ పూర్ణ స్యాత్త్రి జగద్భవేత్ | క్లేశయుజ్నితరాం భూయో దేవాశ్చ మునయస్తథా || 35

న పూర్ణ స్స్యాత్త్రియాకామస్తదా మే నరకో భ##వేత్ | ద్విధాపి ధర్మ హానిర్వై భవతీత్యనుశుశ్రువాన్ || 36

వజ్రాంగ ఇత్థం బభ్రామ స మునే ధర్మ సంకటే | బలాబలం ద్వయోస్తత్ర విచిచింత చ బుద్ధితః || 37

బ్రహ్మ ఇట్లు పలికెను-

జ్ఞాని, సత్వ గుణ సంపన్నుడు, విరోధము లేనివాడు అగు ఆ వజ్రాంగుడు ప్రియురాలి ఈ మాటము విని ఆశ్చర్యమును దుఃఖమును పొంది, తన మనస్సులో ఇట్లను కొనెను(33). నా ప్రియురాలు దేవతలతో వైరమును కోరుచున్నది . నాకు వైరమునందు అభిరుచి లేదు. ఏమి చేయుదును? ఎక్కడికి వెళ్లేదను? నాప్రతిజ్ఞ చెడకుండ ఉపాయమేది? (34).ప్రియురాలి కోర్కెను తీర్చినచో , ముల్లోకములు, దేవతలు, మహర్షులు మరల పెద్ద దుఃఖమునకు గురి యగుదురు(35). ప్రియురాలి కోరిక తీరనిచో , నాకు నరకము సంప్రాప్తమగును. ఈ రెండు పక్షములలోనూ ధర్మమునకు హాని నిశ్చితమని ఆతడు తలపోసెను (36). ఓ మహర్షీ! వజ్రాంగుడు ఈ తీరును ధర్మ సంకటములో పడి తిరుగాడెను. ఆ రెండు పక్షముల బలాబలములను అతడు బుద్ధితో విమర్శించెను (37).

శివేచ్ఛయా సహి మునే వాక్యం మేనే స్త్రియో బుధః| తథాస్తిత్వి వచః ప్రాహ ప్రియాం ప్రతి స ధైత్యరాట్ || 38

తదర్థమకరోత్తీవ్రం తపో%న్యద్దుష్కరం స తు | మాం సముద్దిశ్య సుప్రీత్యా బహువర్షం జితేంద్రియః || 39

వరం దాతుమగాం తస్మై#్మ దృష్ట్వా హం తత్తపో మహాత్ | వరం బ్రూహి హ్యావోచం తం సుప్రసన్నేన చేతసా || 40

వజ్రాంగస్తు తదా ప్రీతం మాం దృష్ట్వా ఖే స్థితం విభుమ్ | సుప్రణమ్య బహు స్తుత్వాం వరం వవ్రే ప్రియాహితమ్ || 41

ఓ మహర్షీ! విద్వాంసుడగు ఆ వజ్రాంగుడు శివుని సంకల్పముచే ప్రియురాలి వాక్యమును అంగీకరించెను. ఆ రాక్షసరాజు ప్రియురాలితో 'అటులనే గానిమ్ము' అని పలికెను(38). అతడు ఇతరులకు శక్యముగాని తీవ్రమగు తపస్సును ఆమె కోర్కెను

తీర్చుటకు చేసెను. అతడు జితేంద్రియుడై నన్ను ఉద్దేశించి పరమప్రేమతో అనేక సంవత్సరములు తపస్సు జేసెను. (39). నేనా మహాతపస్సును గాంచి, అతనికి వరము నిచ్చుటకై వెళ్లితిని. మిక్కిలి ప్రసన్నమగు మనస్సుతో అతనిని 'వరమును కోరుకొమ్మని'చెప్పితిని(40). ఆకాశమునందున్న విభుడనగు నన్ను చూచి , నేను ప్రీతుడనై యుండుటను గాంచి , ఆ వజ్రాంగుడు సాష్టాంగప్రణామమును చేసి అనేక విధముల స్తుతించి , అపుడు ప్రియురాలి కోరికను వరముగా అడిగెను(41).

వజ్రాంగ ఉవాచ|

సుతం దేహి స్వమాతుర్మే మహాహితకరం ప్రభో| మహాబలం సుప్రతాపం సుసమర్థం

తపోనిధమ్ || 42.

వజ్రాంగుడిట్లు పలికెను-

హే ప్రభో! తన తల్లికి గొప్ప హితమును చేకూర్చువాడు, మహాబలశాలి, గొప్ప పరాక్రమము గలవాడు, గొప్ప దక్షుడు, తపసునకు నిధి యగు పుత్రుని నాకు ఇమ్ము(42).

బ్రహ్మోవాచ|

ఇత్యాకర్ణ్య చ తద్వాక్యం తథాస్త్విత్యబ్రువం మునే | అయాం స్వధామ తద్దత్వా విమనాస్సంస్మరన్ శివమ్ || 43

ఇతి శ్రీ శివ మహాపురాణ రుద్ర సంహితాయాం పార్వతీ ఖండే వజ్రాంగతపో వర్ణనం

నామ చతుర్దశో%ధ్యాయః (14).

బ్రహ్మ ఇట్లు పలికెను-

ఓ మహర్షీ! అతని ఆ వాక్యమును విని, నేను 'అటులన్ అగు గాక!'అని పలికితిని. అట్లు వరమునిచ్చి, వికలమైన మనస్సు గలవాడనై, శివుని స్మరించుచూ , నేనూ నా ధామమును చేరుకొంటిని(43).

శ్రీ శివ మహాపురాణములో రుద్ర సంహితయందు పార్వతీ ఖండములో వజ్రాంగతపోవర్ణనమనే పదునాల్గవ అధ్యాయము ముగిసినది.(14)